# వైశ్యప్రబోధిని

తెలుగు మాసపత్రిక



ఫిబ్రవరి 1997





| | Frequency | Fare |
|---|---|---|
| Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,000 |
| Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 500 |
| Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 400 |
| Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | 1,800 |

Fare includes complimentary Dormitary accommodation and transport/ Guide charges. Tariff for Tour No 4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినప్పుడు ఆధునాతన సౌకర్యములతో నిర్మించబడిన మా "హోటల్ సదరన్"లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిసెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

**n Travels/Hotel Southern**

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi.)**

**ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh,**

**New Delhi - 110 005.**

**(Phones : 5722210 (6 Lines); 5789508, 5782932)**

Our branches

Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones 223658, 227233)

Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones 2267040, 2262633)

Hotel Howrah Complex, Opp Madras Central Railway Station, Madras - 600 003 (Phones 564864, 585253)

No 10, Swarnalok Complex, Opp Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones 62227, 66624)

Pavan Palace, Ground Floor, Opp T S R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016 (Phone 545565, 541099)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**
**హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు..ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

**నిచ్చెనమెల్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి**
అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి**
ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**

✆: 6 7

Phones : 42729, 42730, 42731 Fax : 42730, STD : 08552.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
**Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.**

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జ్యోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై ఘన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

**పోలిశెట్టి సత్యనారాయణ** **యక్కలి బాలరత్నం**

(మాసపత్రిక)



**స్థాపితము**
1969

**సంపుటి**
28

**సంచిక**
6



**ఫిబ్రవరి - 1997**



సంపాదకులు
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 24911, 25025.



# వైశ్యులూ - సహకరించండి

శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు మహా పండితులు. మహా కవులు. అవధాని శేఖరులు. అవధాని పంచాననులు. తెలుగు సాహిత్య చరిత్రలో తన పేరును సువర్ణాక్షరాలతో లిఖింప జేసుకొన్నారు. నాన్యతో దర్శనీయమైన ధార, ధారణ కలవారు.

గుప్త గారు తమ జీవిత కాలములో 47,500 పద్యాలు వ్రాసినట్లుగా తెలుస్తూ ఉంది. వీరు వ్రాసిన కొన్ని గ్రంథాల పేర్లు తెలుస్తున్నవి. కానీ వాటిలోని పద్యాల సంఖ్య తెలియుట లేదు. ఆ సంఖ్య తెలిస్తే వీరు వ్రాసిన పద్యాల సంఖ్య యింకా హెచ్చుగా ఉంటుంది. గుప్త గారు తమ కాలానికి ప్రచారములో ఉన్న సాహిత్య ప్రక్రియలన్నింటిలో గ్రంథాలు వ్రాశారు. వచన గ్రంథాలు, యక్షగానాలు, స్తోత్రాలు, నామావళులు, నవలలు, విమర్శనా గ్రంథాలు, హరికథలు వీరి గ్రంథాలలో ఉన్నాయి.

గుప్త గారు అఖండ ప్రతిభావంతులు. అత్యంత ధారణా శక్తి గలవారు. ఆశువుగా వీరు పద్యాలు చెప్తూ ఉంటే వ్రాసుకోడానికే కష్టంగా ఉండేదట. అంతటి అనర్గళ ధార గుప్త గారిది. గుప్తగారు తమ జీవిత కాలములో మూడు వందలకు పైగా అవధానాలు చేశారు. తొలి పీటె వేసి గౌరవించదగిన ఆనాటి కవి - పండితుల్లో గుప్త గారూ ఒకరు. సంస్కృతము, ఆంగ్లము, బెంగాలీ భాషలు కూడ గుప్త గారికి బాగా వచ్చు. బెంగాలీ భాషలోని రవీంద్ర కవీంద్రుని "చిత్ర" రచనను తెనిగించారు. "కోమటివి" అని గర్హించిన కొందరు భూసురకవి, పండితులను మీసం మీద చెయివేసి సవాలు చేశారు. వారి అవిజ్ఞతనూ, అసూయనూ,

మత్సరాన్నీ సహృదయ శేఖరులకు చూపి చెంపలు వాయించి పంపారు.

"ఏను వైశ్యుడన్ - మీరిటగోర చెప్పితిని మీసము గల్గిన ఈసడింపుడీ" అంటూ ధిషణా గర్వముతో జవాబు చెప్పిన గుప్త గారు చదువుల తల్లి కరుణా కటాక్షాలను కొకొల్లలుగా దోచుకున్నారే కానీ, కలుముల జవరాలి కడగంటి చూపులకు కూడ నోచుకోలేక పోయారు.

అగర్భ శ్రీమంతులూ, అవిరళ దాన ధర్మ తత్పరులూ అగు వైశ్యులు తమ కులములో పుట్టిన ఒక మహాకవినీ, ఒక మహా పండితున్నీ ఆదరించలేక పోయారంటే వైశ్యులకు గల సాహిత్యాభిలాషను బేరీజు వేసుకోవచ్చు.

తమ కులస్థుడైన ఒక మహా కవికి, ఒక పండిత వృషభునికి, ఒక పూర్ణ ప్రజ్ఞునికి భాషా చరిత్రలోనే కాక, లౌకిక ప్రపంచములోనూ ఉన్నతోన్నతమైన స్థానాన్నీ, చిరస్మరణీయ స్మృతి చిహ్నాన్నీ సమకూర్చాలని శ్రీమంతులగు వైశ్యులు ప్రయత్నించక పోవడం మిక్కిలి శోచనీయం.

గుప్త గారికి జరుగుచున్న ఈ అన్యాయాన్ని గమనించిన ఈ పత్రికాధిపతులు "శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠము"ను కడపలో స్థాపించారు. ప్రొద్దుటూరు పురప్రముఖులు శ్రీ జూటూరు రమణయ్య గారు అధ్యక్షులుగాను, ఈ పత్రికాధిపతులు ప్రధాన కార్యదర్శులు గానూ ఉన్న ఈ పీఠము 1991లో స్థాపించబడి రిజిష్టరు కూడ అయింది.

గుప్త గారి పేర ప్రతి ఏడూ సాహిత్య పరిశ్రమ చేసే వారికి 'అవార్డులు ఇవ్వడమూ, గుప్త గారి ముద్రిత, అముద్రిత గ్రంధాలను ప్రచురించడమూ ఈ పీఠము యొక్క ప్రధాన లక్ష్యాలు.

గుప్త గారి పేర 1996 నుండీ ఈ పీఠము అవార్డులను ఇస్తూ ఉంది. తన తొలి అవార్డును 12.2.1996వ తేదీన, శతావధానులూ, సరస్వతీపుత్రులూ శ్రీ సి.వి.సుబ్బన్న గారికి ఇచ్చింది. ఈ ఏడు ఈ అవార్డును 12.2.1997వ తేదీన శతావధాన సార్వభౌమ, అవధాన కళాతపస్వి శ్రీ మేడసాని మోహన్ గారికి ఇస్తూంది.

గుప్తగారి గొప్పదనాన్ని గుర్తించిన కడప ఆకాశవాణి కేంద్రము వారు గుప్త గారి పేరు మీద రెండు ప్రసంగాలను ప్రసారం చేశారు.

ఆంధ్ర భాషా యోషను అనేకానేకాలంకారాలతో అలంకరించిన శ్రీ గుప్త గారి పేర ఏర్పాటైన ఈ పీఠానికి సహకరించడము వైశ్యుల కర్తవ్యము. వారిలోని సాహిత్యాభిలాషను ప్రకటించుకొనేందుకు ఇది మంచి అవకాశం.

## ఒక జాతి యావత్తుకూ నేతగా ఉన్నవారు ఎంతో హుందాగానూ - ఔదార్యముతో - విశాల హృదయముతో ఉండవలయునన్న విషయాలు జ్ఞప్తికి చేయవలయునా!

**ఆం.ప్ర. ఆర్యవైశ్య మహాసభ అధ్యక్ష కార్యదర్శులకు శ్రీ జూటూరు రమణయ్య గారి సూటి ప్రశ్న.**

మాన్యశ్రీయుతులు
మహాసభ అధ్యక్ష, కార్యదర్శుల గారలకు,

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మసంస్థల సమాఖ్య ఆంధ్రప్రదేశ్ వారు 5.1.97 తేదీ వైశ్య మహాసభ భవనమున సమాఖ్య సమావేశము జరుపబడినది కదా! ప్రధాన కార్యదర్శి శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు ముందుగానే మీకు ఫోన్ చేసి ఆహ్వానించినట్లు, మీరు వస్తామని చెప్పినట్లు తెలిసినది.

చర్చనీయాంశము : వైశ్యులు నడుపుచున్న దేవ్యాలయాలు మరియు ఆర్యవైశ్య ధర్మసంస్థల, సుప్రీంకోర్టు వ్యాజ్య విషయమై చర్చించుట. ఈ విషయమై చాలా మంది పెద్దలు తీర్పు ఏమి వస్తుందోనన్న భయాందోళనతో వున్నారు. ఆనాడు సమావేశ ప్రారంభ సమయానికి మీరు వచ్చినారని తెలిసి, మిమ్ములను ఆహ్వానించుటకు ప్రకాశం జిల్లా అధ్యక్షులను పంపగా, మీరు "పెద్దలు శ్రీ లక్ష్మీకాంతం గారున్నారు కదా! వారుంటే అందరున్నట్లే" అని చెప్పి పంపినారు.

మహాసభ అందరికీ మాతృ సంస్థ. దాని శాఖయే ఈ సమాఖ్య. మహాసభ అధ్యక్షులకు అన్ని శాఖలపై అధికారము, వాటి ఉన్నతిని గమనించు బాధ్యత వుండు నన్న విషయం తమకు తెలియనిది కాదు గదా! వ్యక్తిగత విభేదాలు విస్మరించి, సమైక్యంగా ఆలోచించవలసిన సమయములో, సమావేశానికి అధ్యక్ష, కార్యదర్శులు హాజరుకాక పోవడము చాలా మంది సభ్యులకు తీవ్ర మనస్తాపాన్ని కలిగించినది. ఒక జాతి యావత్తుకూ నేతగా వున్న వారు ఎంతో హుందాదాను, ఔదార్యముతో, విశాల హృదయముతో వుండవలయునన్న విషయాలు జ్ఞప్తికి చేయవలయునా? మహా

### సమాఖ్య సభ్యులతో గదుల బాడుగలు వసూలు చేయుట మిక్కిలి శోచనీయము.

ప్రళయము ముంచుకొస్తున్న సమయంలో కూడా మీరు నిబ్బరముగా, ఏమీ పట్టనట్లు, నిర్లిప్తంగా సమావేశానికి రాకపోవడము సభ్యులను అబ్బురపరచినది. సమాఖ్య సమావేశమునకు వచ్చిన సభ్యులతో గదులకు బాడుగలు వసూలు చేయడము మిక్కిలి శోచనీయమైనది. తిరుమల గుబ్బా వారి సత్రంలో మహాసభ సమావేశాలు మరియు సమాఖ్య సమావేశాలు జరిగినపుడు శ్రీ ఆర్.ఆర్. నాథం గారు ఉచిత వసతి, మంచి భోజనము ఏర్పాటు చేసిన సంగతి మరచినారా?

ఆనాడే మాట్లాడాలను కున్నాను. అవకాశము కలుగలేదు సహృదయంతో ఆలోచింపుచకర్తలు.

ఇట్లు
భవదీయ
***J. Ramanaiah***

# విమర్శలో విజ్ఞతను పాటించాలి

## తెలుగు సీమ పత్రికకు శ్రీ వెంకట సుబ్బయ్య

11.1.97వ తేది నాటి తెలుగు సీమలో 'ఈ రోజు మహాసభ నామ సంస్మరణ?'' అనే శీర్షిక క్రింద వేసిన ప్రకటన పేరు ప్రకటించకుండా ముసుగులో గుద్దులాట లాడటంలో వైశ్య ప్రబోధినీ సంపాదకులు లక్ష్మీకాంతం గారిని విమర్శించినట్లుగా అర్థమౌతుంది. ఆయన పట్ల అంత తీవ్ర స్థాయిలో విమర్శ విజ్ఞత అనిపించుకోదు. తమ అభిమానిని ఎంతైనా పొగడ వచ్చు. కానీ ఎదుటి వారిని విమర్శించేటప్పుడు వారి గత చరిత్రను కూడా దృష్టిలో పెట్టుకొని ఆచితూచి విమర్శించడం విజ్ఞత అనిపించు కుంటుంది. అం.ప్ర. ఆర్యవైశ్య మహాసభ అధికారవాణి ''వాసవీ ప్రవంతి'' లేనపుడు గత మూడు దశాబ్దాలుగా వైశ్య ప్రబోధిని మహాసభకు అధికారవాణిగా పనిచేసింది. ఇప్పుడు వైశ్య సంఘాల సమావేశాలలో మోయలేనన్ని పూల హారాలతో ముంచెత్త బడుచున్న మహాసభ నాయకులకు వైశ్య ప్రబోధిని పేరు పేరునా యావత్ భారత దేశ వైశ్యులకు పరిచయం చేసింది. వీరి జీవిత చరిత్రలను ప్రకటించింది. సమావేశాలు ఎలా జరపాలో ముందుండి సలహాలిచ్చి కృషిచేసిన వారు లక్ష్మీకాంతం కాదని ఎవరూ అనలేరు. మచ్చుకు ఒక ఉదాహరణ. 1976లో అనంతపురం జిల్లా కనగానపల్లెలో జరిగిన ధర్మవరం తాలూకా ఆర్యవైశ్య సంఘ సమావేశం రాష్ట్రస్థాయిలో జరిపించుటకునూ, చర్చలు సజీవంగా జరుపుటకునూ వారు ముందుండి చేసిన కృషి మరువరానిది. అంతేల ఆ రోజుల్లో రాష్ట్ర నాయకులందరూ లక్ష్మీకాంతం గారిని వేనోళ్ళ పొగిడిన సందర్భాలెన్నో వున్నాయి.

1977లో విజయవాడలో జరిగిన అం.ప్ర. ఆర్యవైశ్య మహాసభ నిర్వహణకు ముందుండి కృషిచేసినవారెవరు? మహాసభ నిబంధనావళిని రూపకల్పన చేసిందెవరో శ్రీ రోశయ్యగారే చెప్పాలి. పంగులూరి సీతమ్మ దానపు ఆస్తిని దుర్వినియోగం కాకూడదనే వార్తలు అనేక సార్లు వైశ్య ప్రబోధినిలో ప్రకటించడం పాఠకులకు తెలుసు.

చింతామణి సినిమా నిర్మాణానికి అడ్డకట్ట వేయుటకు లక్ష్మీకాంతం గారు వైశ్యప్రబోధినీ పత్రిక ద్వారా చేసిన కృషి అపారం. సీతమ్మ ఆస్తి విషయంలో మహాసభ నాయకులు చేపట్టిన అలక సారధ్యమును గూర్చి మహాసభ నాయకులను కాసుకు కాకుండా, గతంలో విమర్శించిన తెలుగుసీమ ఈనాడు మహాసభ నాయకుల్లో ఒకరైన పరుచూరి వెంకటేశ్వర్లు గార్కి ఇంత పెద్ద కితాబివ్వడంలో పాఠకులు నిజరూపాన్ని

గ్రహిస్తారు.

పంగులూరి సీతమ్మ దానపు ఆస్తి విషయమై దాని రక్షణకు వాసవీ స్రవంతి త్రికరణ శుద్ధిగా ఏనాడైనా ప్రకటించిందా? మహాసభ అనుబంధ సంఘాల సమావేశాలలో సీతమ్మ దానపు ఆస్తి విషయం చర్చించడానికి అవకాశం ఇవ్వ బడిందా? అనుకూల తీర్మానాలు చేయబడినవా? అంటే లేదు అనే సమాధానం వస్తుంది. హైకోర్టులో గెలిస్తే మాత్రం పై ఆస్తిని స్వాధీనం చేసుకొనే శక్తి మన కుందా? అని ప్రశ్నించే నాయకుల తెలివైన వాదన ఏమి సూచిస్తుంది? ఆక్రమణ దార్లకు పరోక్షమైన మద్దతివ్వడం లేదా? దానపు ఆస్తిని కాపాడుటకు అంచల వారి పోరాట కార్యక్రమాన్ని మహాసభ ఇచ్చిందా? లేదు. అట్టివారు వైశ్యుల ఏకైక నాయకులుగా ఎన్నికలబరిలో వుంటే వైశ్యుల దేవాలయాల అస్థిత్వ రక్షణకు కృషి చేస్తున్న మరియు జనవరి వైశ్య ప్రబోధినీ సంపాదకీయంలో సీతమ్మ దానపు ఆస్తి రక్షణకు అంచల వారి పోరాటానికి పిలుపుకు అన్ని వైశ్య సంఘాలు కృషి చేయాలని ప్రకటించిన లక్ష్మీకాంతం గారిని విమర్శించడం తగని పని.

నాకు కూడా లక్ష్మీకాంతం గారి పట్ల కొంత అభిప్రాయ భేదముంది. అంత మాత్రాన గతంలో చేసిన వారి కృషినీ, సేవనూ, త్యాగాన్నీ మరవడం కృతజ్ఞత అనిపించుకోదు. పోతే మహాసభ నిబంధనావళిలో పాలకవర్గ ఎన్నికలు ప్రజాస్వామ్య బద్ధంగా జరగాలి అనే అంశంపై అభిప్రాయ భేదాలున్నంత మాత్రాన వారిని మహాసభ అధ్యక్ష ఎన్నికకు పనికిరాడనే భావం వ్యక్తీకరించడం సాహస చర్య ఔతుంది.

ఒక పత్రిక అధిపతి వేరొక పత్రిక అధిపతిని విమర్శించడం అంటే ప్రస్తుతం తిరుపతి తిరుమల దేవస్థానం ధర్మసంస్థ సీతమ్మ దానపు ఆస్తి ధర్మసంస్థ ఆస్తిని కోరడం వలే వుంటుంది. పొట్టి శ్రీరాముల జిల్లా నిర్మాణ విషయంలో పరుచూరు వెంకటేశ్వర్లు గారు చూపిన మనసా వాచా కర్మణా కృషి ఏమిటో ఒకసారి సమీక్షించుకుంటే చాలు వారి నిజాయితీ బయటపడుతుంది. ఎంచుకుంటే మంచమంతా బొక్కలే. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. దయచేసి ఇక ముందు తెలుగు సీమ సాటి కార్యకర్తలను విమర్శించే దశకు పోకూడదనేదే నా మనవి. తప్పులు అందరూ చేస్తారు. తప్పులను ప్రక్కకు పెట్టి ఒప్పులకు విలువ ఇచ్చి సంఘ సమైక్యతకు దోహదం చేయుటే విజ్ఞత.



## శ్రీ చిటిప్రోలు 'పలుకరింపు'



కలుష కౌటిల్య కల్లోల కంపనముల
వింత వంతల పాలైన విపుల జగతి
అఖిల యోగేశ్వరుని కృపావాప్తి నలరి
తేజరిల్లుత! సంక్రాంతి దివ్య దీప్తి.

– చిటిప్రోలు కృష్ణమూర్తి.

# మహాసభ కొంత మంది వ్యక్తులకే పరిమితం కావడము విచారకరము

**- కడప జిల్లా ఆర్యవైశ్య మహాసభలో శ్రీ వంకదార వీరభద్రయ్య**

ఎందరో మహానుభావులు, దానశీలురు, పారిశ్రామికవేత్తలు, వణిక్ ప్రముఖులు, రాజకీయ నాయకులు, ఆధ్యాత్మిక సంపన్నులు పాల్గొన్న ఈ సమావేశములో వైశ్యజాతి ఔన్నత్యాన్నీ, అభ్యుదయాన్నీ, కీర్తినీ కోరి ఈ జాతిని సుసంఘటితం చేయడం కోసం, సుసంపన్నం చేయడము కోసం సమాజంలో మనకొక ప్రత్యేకత, ఒక గుర్తింపు సాధించడము కోసము ఉదాసీనతను వీడి విశాల భావముతో ఆలోచించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

ఈ సమాజంలో వైశ్యుడు వ్యక్తిగతంగా కాని, సమాజపరంగా కాని పోరాడవలసి వచ్చినపుడు వైశ్యులు ఇస్తున్న సహకారాన్నీ, అవలంభిస్తున్న అవకాశవాదాన్నీ, ఈర్ష ద్వేషాలనూ గమనించినపుడు మనము వైశ్యులుగా ఎందుకు పుట్టామా? అని అనిపిస్తుంది. కాని మనలో కొన్ని లోపాలు ఉన్నప్పటికీ ఇతర జాతుల కంటే మేలనిపిస్తుంది. ఈనాడు అన్ని కులాలు తమ కుల ధర్మాలను విస్మరించాయి. కాని ఈనాటి వరకూ కుల ధర్మాన్ని విస్మరించక మనుగడ సాగిస్తున్న జాతి ఏదైనా ఉన్నదంటే అది వైశ్యజాతి ఒక్కటే. ఇన్ని సంవత్సరాలు ఈ జాతి ఎలా మనగలిగినది? తన సంస్కృతిని ఎలా కాపాడుకుంటూ వచ్చినది? అన్న విషయాన్ని అధ్యయనము చేసి ప్రతి వైశ్యుడూ తనకు తాను తెలుసుకొని, తెలుసుకున్న విషయాన్ని వ్యక్తిగా ఆచరించిన నాడే ఈ జాతి మనుగడ నిలుస్తుంది. మన గౌరవమును కాపాడుతుంది. అంతేకాని కొంతమంది వ్యక్తులకే పరిమితమైన మహాసభ ఈ పని జేయజాలదు. ఉదాహరణకు మన జిల్లాలో ఉన్న వైశ్యులు ఎంత మంది? ఈ సభలో సభ్యత్వమున్నది ఎంతమందికి? ఏ సంస్థ యైనా ఒక జాతికి నాయకత్వము వహించేటప్పుడు ఆ జాతిలో జన్మించిన ప్రతి వ్యక్తినీ గురించి ఆలోచించాలి. వాడు దరిద్రుడు కానివ్వండి. ధనవంతుడు కానివ్వండి. బలవంతుడు కానివ్వండి. బలహీనుడు కానివ్వండి. ఎవరైనా సరే వైశ్యుడన్న ప్రతి ఒక్కడూ అందులో ప్రాతినిధ్యము వహించాలి. లక్షలాది వైశ్యులున్న మన జాతికి వందలు, వేలలో సభ్యులున్న మహాసభ ప్రాతినిధ్యము వహించగలదని భావించడము ఆత్మవంచన కాగలదు. మన జాతికి ఏమీ లేనపుడు రాష్ట్ర స్థాయిలో

మన గుర్తింపు కోసము వైశ్య మహాసభను ఏర్పాటు చేసినందులకు స్థాపకులను అభినందించ వలసినదే! కృతజ్ఞత తెలియజేయ వలసినదే! కాని ఈ సభ ఇన్ని సంవత్సరాలు గడిచినా కొంత మందికి మాత్రమే పరిమితమై పోవడము మిగుల విచారకరము. ఒక్క మాటలో చెప్పాలంటే ఇది స్థిరమైన పునాదులు లేని గాలి మేడ. రాష్ట్ర రాజధాని హైదరాబాదులో ఇన్ని అంతస్తులు గల భవనాన్ని ఎన్నో లక్షలు ఖర్చు పెట్టి కట్టినాము గదా! ఇది మనము సాధించిన ప్రగతి కాదా! అని అనవచ్చు. ఇది ఎంత మాత్రము కాదు.

ఇది మహాసభలోని కొంతమంది పలుకుబడి కలిగిన వారికీ, ధనవంతులకూ ఆవాస కేంద్రము మాత్రమే. దీనికి ఎన్ని లక్షలు ఖర్చు పెట్టారు? ఎవరికి ఉపయోగ పడుతున్నది? అన్నది అప్రధానమైన ప్రశ్న. లక్షలు వసూలు చేయడం, బిల్డింగులు కట్టడమే గొప్పతనమా? ఇదే మన లక్ష్యమా? ఈ బిల్డింగులను చూచి మనలను గౌరవిస్తున్నారా? వీటిని చూచి వైశ్యులకు పార్టీ టికెట్లు ఇస్తున్నారా? ఆలోచించండి. ఏమీ చేయకుండా ఉండే దాని కంటే కొంతైనా కృషి చేయుచున్నటు వంటి మహాసభ మంచిదే కదా? అను అభిప్రాయముతో ఏకీభవిస్తాను. నేను కోరుతున్నది మిమ్ములను ఆలోచన చేయమంటున్నో విషయాలు తెలియ జేస్తున్నాను. ఆలోచించండి.

మన సంఘం అంటే మహాసభ ఇందులో ప్రతి వైశ్యునికీ ప్రాతినిధ్యము ఉండాలి.

ఇవి గ్రామ సంఘాలుగా, పట్టణ సంఘాలుగా, జిల్లా సంఘాలుగా, రాష్ట్ర సంఘముగా ఒకదానికి ఒకటి అను సంధానం కావాలి.

ప్రతి వైశ్యుడూ తన కుల విశిష్టతను విస్మరించకుండా కుల ధర్మాలను పాటిస్తూ, నైతిక విలువలతో జీవించాలి. ఇందుకు మహాసభ పూర్ణ దర్శకత్వము వహించాలి.

ప్రతి వైశ్యుడూ నిర్భయంగా, గౌరవంగా, జీవించుటకు సంఘము అండగా ఉండాలి.

వైశ్యులమంతా ఒక్కటేనన్న భావము నరనరాలలో జీర్ణించుకు పోవాలి. ఏ ఒక్క ఇతర వైశ్యునికి హాని కలిగినా అది తనకు కలిగినట్లుగా భావించాలి. అందుకు అనుగుణంగా స్పందించాలి.

వైశ్యులలో పెద్దలుగా చలామణి అయ్యేవారు తమ వారసులు పల్లకీ ఎక్కే వారుగా ఉండాలని కోరుకోవాలే గాని పల్లకీ మోసే వారిని, తమ చెప్పు చేతులలో ఉండే వారిని, తమ పలుకుబడితో నాయకులను చేయుట మానుకోవాలి. ఈ మైత్రి జాతిని నిర్వీర్యము చేస్తుంది.

ఈనాడు సమాజములో మన వారిని

మనము సమర్థించవలసిన విషయాలలో తక్కువగా సమర్థిస్తున్నాము. విమర్శించ వలసిన విషయాలలో ఇతరులకంటే ఎక్కువగా విమర్శిస్తున్నాము. ఎవరైనా పైకి వస్తుంటే మనవాని కాళ్ళను మనమే పట్టి లాగుతున్నాము. ఇటువంటి దుర్గుణాలను తొలగించుటకు సంఘ పరంగా ఆలోచించాలి.

ఈనాడు సమాజంలో ఎవరికి ఏ విపత్తు సంభవించినా వ్యక్తిగతంగా ఇతర సంస్థల ద్వారా సహాయము చేస్తున్నాము. ఆ సహాయము మన సంఘము ద్వారా చేసినపుడు అది మన జాతి గౌరవాన్ని పెంచుటకు ఉపయోగపడుతుంది. మన సంఘాలు కూడా ఇటువంటి అవకాశాలు వినియోగించుకోవాలి.

అనేక మంది వివిధ రకాలుగా శక్తి సామర్థ్యములు ఉన్నప్పటికీ, తమ సేవలను సంఘానికి అందించాలనే ఆసక్తి ఉన్నప్పటికీ మన సంఘ కార్యక్రమాలలో పాల్గొనకుండా దూరంగా ఉంటున్నారు. ఎందుచేత? మన సంఘాలలో జరిగే ఎన్నికలలో పదవులు తమ పరువును పెంచుతాయనే అభిప్రాయము ఏర్పడడముతో కీర్తి కాముకులు, పదవీ లాలసులు అనేక మార్గాల ద్వారా పదవులు చిక్కించుకుంటున్నారు. అటువంటి మార్గాలను ఇష్టపడని వారు దూరంగా ఉంటున్నారు. విజ్ఞులు అయినవారు ఉదాసీనంగా ఉండడముతో ఈ పదవికి నేను అర్హుడనా? కాదా? అన్న విచక్షణ లేకుండా పదవుల కోసము ప్రాకులాడు తున్నారు. ఇటువంటి పరిణామాలు సంఘమును నిర్వీర్యము చేస్తాయి. పెద్దలమూ, నాయకులమూ, అనుకుంటున్న వారిలో తదనుగుణమైన మార్పు ఇక ముందైనా వస్తుందా?

## ఆత్మకూరు ఆర్యవైశ్య సంఘం, ఆర్యవైశ్య యువజన సంఘాలకు నూతన కార్యవర్గం

కర్నూలు జిల్లాకు చెందిన పై రెండు సంఘముల సర్వ సభ్య సమావేశము ఈ మధ్య జరుగ క్రింది వారలు నూతన కార్యవర్గమునకు ఎన్నికైరి.

### ఆర్యవైశ్య సంఘము :

అధ్యక్షులు శ్రీ నరహరి నరసింహయ్య శ్రేష్ఠి, ఉపాధ్యక్షులు శ్రీ పెసల దామోదర గుప్త, ప్రధాన కార్యదర్శి శ్రీ కొత్త శేషఫణి శ్రేష్ఠి, కార్యదర్శి శ్రీ అత్తలూరు శ్రీనివాసులు శ్రేష్ఠి, కోశాధికారి శ్రీ బచ్చు సూర్య నారాయణ శ్రేష్ఠి.

### ఆర్యవైశ్య యువజన సంఘం :

అధ్యక్షులు శ్రీ గోపాలకృష్ణ, ఉపాధ్యక్షులు శ్రీ చిత్రాల వెంకట కృష్ణ, ప్రధాన కార్యదర్శి శ్రీ పువ్వాడ భాస్కర్, కార్యదర్శి శ్రీ ఎ. బీసు మల్లేశ్వర గుప్త, కోశాధికారి శ్రీ పువ్వాడ రామకృష్ణ.

# బోసు చరిత్రను ముద్రించినందుకు కే.సి. గుప్తకు జైలు శిక్ష

శ్రీ కె.సి. గుప్త గారు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు. వైశ్య సమాజాభ్యున్నతికి జీవితమంతా అంకితం చేశారు. ఇప్పటికీ అదే ధ్యాసలోనే వైశ్య సంఘానికి సేవ లందిస్తున్నారు. అయినా, గుప్త గారిని "ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్ష పదవికి తగవు పో", - అన్నారు. ఈ మహా త్యాగి దాన్ని సరుకు చేయలేదు. ఆ తరువాత కూడ అదే దీక్షతో తన కృషిని సాగిస్తున్నారు. ప్రధమార్యవైశ్య మహాసభ ఎప్పుడు జరిగిందీ తెలియని వారూ, మహాసభను గురించి రెండు వాక్యాలు చక్కగా వ్రాయలేని వారూ, రెండు మాటలు చక్కగా మాట్లాడలేని వారూ అధ్యక్షు లయ్యారు కూడ. వైశ్య సంఘ సేవే జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న వారికి వైశ్య సంఘములో గుర్తింపు లేదనేందుకు ఈ గుప్తగారు మంచి ఉదాహరణ.

1938లో శ్రీ గుప్తగారు అణా గ్రంధమాలను స్థాపించారు. ఈ గ్రంథమాల తరపున రాజకీయ పుస్తకాలను కూడ ప్రచురించారు. ఈ గ్రంథమాల ముద్రించే పుస్తకాలను ఒక అణా అంటే ఈనాటి దశాంశ పద్ధతిలో ఇంచు మించు ఆరు పైసలకు అమ్మేవారు. ఈ గ్రంథమాల ప్రచురించిన 20వ సంఖ్య గల పుస్తకమే "నేతాజీ సుభాష్ చంద్రబోస్ చరిత్ర". కాంగ్రెసు ఆమోదించిన క్విట్ ఇండియా తీర్మానమూ, సుభాష్ చంద్రబోస్ అధ్యక్షోప న్యాసమూ, మరికొన్ని విషయాలూ, రెండవ ప్రపంచ యుద్ధములో ఆంగ్లేయులకు తోడ్పడ కూడదనీ, సహాయం అందించకూడదనీ, ఈ సహాయ నిరాకరణను స్వాతంత్ర్యం సిద్ధించు వరకూ లేక స్వాతంత్ర్యము ఇస్తామని ప్రకటించే వరకూ కొనసాగించాలనీ చేసిన తీర్మాణాలూ ఈ పుస్తకములో ఉన్నాయి.

"హాలిన్సు" ఆనాటి హైద్రాబాద్ సంస్థానములో ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు. ఇతడు యూరోపియన్ "శ్రీ కె.సి గుప్త యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారము చేస్తున్నారు. వెంటనే డిఫెన్సు ఆఫ్ ఇండియా ఆక్టు క్రింద అరెస్టు చేయ"మని ఆదేశాలు ఇచ్చారు గుప్త గారిని అరెస్టు చేసి జైల్లో పెట్టారు. అప్పుడు గుప్త గారి వయస్సు 20 సంవత్సరాలు. గుప్త గారిపై డిఫెన్సు ఆక్టులోని రెండు సెక్షనుల క్రింద కేసు పెట్టారు ఒక్కొక్క సెక్షన్ క్రింద 12 సంవత్సరాలు శిక్ష విధించ వచ్చు. ప్రముఖ కాంగ్రెసు నాయకులూ, న్యాయవాదులూ స్వర్గీయ బూర్గుల రామకృష్ణారావు, మరో పది మంది ఇతర ప్రసిద్ధ న్యాయవాదులూ ఈ కేసులో పాల్గొని, "మా పిల్లవాడు తప్పు చేయలేదు. ఇది మా సివిల్ మరియు ఫండమెంటల్ రైట్" అని కోర్టులో వాదించారు. "ఆంధ్రపిత" మాడపాటి హనుమంతరావు గారు కోర్టుకు వచ్చి పుస్తకములో అభ్యంతరకరమైన విషయాలు ఏమీ లేవు అని వాదించారు. ఇతను చిన్న పిల్లవాడు. "ఈతని పై దయ గలిగి 6 నెలలు మాత్రమే శిక్షను విధిస్తున్నాను" - అని మేజిస్ట్రేట్ తీర్పు నిచ్చాడు. హైద్రాబాద్ లోని అన్ని రాజకీయ పార్టీలు, నాయకులూ ఇంత చిన్న వాని పైన కేసు పెట్టి జైలు శిక్షను విధించినందుకు సానుభూతిని ప్రకటించారు. 23.5.1942లో ఈ పుస్తకాన్ని డిఫెన్సు రూలు 33 (7) హైద్రాబాద్ క్రింద నిషేధించారు.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్)

టెలిగ్రాం అన్నిచోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

వసతి సత్రమునకుగాను రు.1116-00 పైన సమర్పించిన వారికి అన్ని సత్రములలో శాశ్వత సభ్యత్వం కలదు.

1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు యివ్వబడును. 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

### తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. <u>శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్ధ మహా క్రతువు</u> 25.4.97 నుండి 3 5.97 వరకూ విజయవాడ శ్రీ భావనారాయణ కాలేజీలో జరిపించుచున్నాము.

పై యజ్ఞము జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు - మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన యజ్ఞం, రెండవరోజు రామకృష్ణ యజ్ఞం, మూడవరోజు అష్టలక్ష్మి యజ్ఞం, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి యజ్ఞం, ఐదవ రోజు పుత్రకామేష్టి యజ్ఞం, ఆరవరోజు రుద్రయజ్ఞం, ఏడవ రోజు సప్తశతి, దుర్గాయజ్ఞం, ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి యజ్ఞం, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ యజ్ఞం, పూర్ణాహుతి జరుపబడును మధ్యాహ్నం 12 నుండి 4 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, 4 నుండి 7 వరకు ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-8 వరకు లక్ష దీపాలంకరణలు, 8-10 ఆధ్యాత్మిక ప్రదర్శనలు జరుపబడును. యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## <u>ఇందులకై సమర్పించవలసిన విరాళములు</u>

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము


ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

వాసవీ సత్ర సముదాయం,

3-308, మార్కాపురం - 523 316.


N.B. : పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగినన్నూ డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 ఫిబ్రవరి 21 నుండీ 1997 మార్చి 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 23 | 2 | 9 | 16 |
| సోమవారము | | 24 | 3 | 10 | 17 |
| మంగళవారము | | 25 | 4 | 11 | 18 |
| బుధవారము | | 26 | 5 | 12 | 19 |
| గురువారము | | 27 | 6 | 13 | 20 |
| శుక్రవారము | 21 | 28 | 7 | 14 | |
| శనివారము | 22 | మార్చి 1 | 8 | 15 | |

ఫిబ్రవరి 22 :- స్వామి దయానంద సరస్వతీ జయంతి.

ఫిబ్రవరి ౽౦ :- పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 జనవరిలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఫిబ్రవరి 28లోగా చేర్చాలి.

ఫిబ్రవరి 28 :- 1997 జనవరి జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

మార్చి 4 :- పూర్వాభాద్ర కార్తె రాక పగలు గం. 3-11 ని.లు.

మార్చి 7 మహా శివరాత్రి

మార్చి 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

మార్చి 17 :- ఉత్తరాభాద్ర కార్తె రాక రాత్రి గం. 11-18 ని.లు.

మార్చి 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

**23, 2, 9, 16 ఆదివారాలు**

*నన్ను మీ టేబుల్ళుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*






# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.

STD, ISTD, FAX Facilities.

A Doctor on call.

Safety Lockers.

Ample parking space.

10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 394320, Res : 313796 (STD : 040) Fax : 394320**

# శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారి వాఙ్మయ సౌభాగ్యము

**డా. సి.వి. సుబ్బన్న శతావధాని,** ఎమ్.ఏ., పిహెచ్.డి., డి.లిట్., ప్రొద్దుటూరు.

*కడప పట్టణములో ఈ పత్రికా సంపాదకులఁ కృషితో ఏర్పాటైన శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠమువారు, ప్రతియేటా గుప్తగారి స్వర్గారోహణ దినమైన ఫిబ్రవరి 12న ఒక అవధానిని, లేక ఒకమంచి పద్యకవికి గుప్తగారి పేర వెంకటస్వామిగుప్త అవార్డును ఇవ్వాలన్న తీర్మాణము మేరకు 12.2.1996న ఆ తొలి అవార్డును శతావధాని డాక్టర్ సి.వి.సుబ్బన్న గారికి ఇచ్చారు. అవార్డును స్వీకరిస్తూ శ్రీ సుబ్బన్నగారు చేసిన ప్రసంగమే యీ వాఙ్మయ సౌభాగ్యము. - సంపాదకులు*

శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారు ఇరువదవ శతాబ్ది పూర్వభాగమునకు జెందినవారు. శతావధాని ప్రసిద్ధులు. ఆ కాలమున శతావధానము చేసిన - చేయఁగలవారే - శతావధాని బిరుదము ధరించు చుండిరి. ఇపుడు కాలము మాఱినది. పట్టుమని పదిమంది పృచ్ఛకులకు గూడఁ బద్యములు చెప్పఁజాలని వారును 'శతావధాని' బిరుదము తగిలించుకొని విఱ్ఱవీఁగుచున్నారు. అడిగెడివారు లేరు. ఆకాలమున ఈపప్పులుడికెడివి కావు. ఉద్దండపండితులు కూర్చుండి పరీక్షించుచుండిరి. కనుక శ్రీగుప్తగారు రచ్చలో రాటుదేలిన యవధాని యని చెప్పనక్కఱలేదు.

శ్రీగుప్తగారు నిండువిగ్రహము. నేను విజయవాడ వెళ్ళినపుడెల్ల గుప్తగారిని జూచి పలుకరించి వచ్చెడివాఁడను. అప్పటికే వార్ధక్యముచే మెత్తబడియుండిరి. వారు మౌనముద్రతోనుండినను మానస జిహ్వచే రామనామము జపించుచుందురు. ఉత్తరము వ్రాసినచో "శ్రీ రామచంద్రాయ నమః" అని యారంభింతురు. అవధానము "శ్రీరఘురామా" అనియే యారంభింతురు. అట్టి సత్పురుషుని ఈచల్లని వేళ స్మరించుట యానందదాయకమైన విషయము.

గుప్తగారి జాతకచక్రదేవతోపాసనస్థానమునకుఁ గేతుగ్రహస్పర్శ కలదేమో, షిరిడీ సాయిబాబా యోగిని దేవభాషతో నుతింతురు. ఈ యుపజాతి వృత్తము వినుఁడు.

"శ్రీసాయిబాబా చరణారవిందే, వందే ముదా, రక్షితదీనబృందే,
సమస్తపాపాంతక శక్తిరుంద్రే, సమస్తసౌఖ్యప్రద రీత్యమందే"

రచన తూఁగుటుయ్యేల వలె సాఁగినది. అసలు ఉపజాతివృత్తము నెన్నికొనుటలోనే విశేషమున్నది. ఇదొక ముద్రాలంకారభేద మనవచ్చు. ఈశ్లోకమున నంత్యప్రాస సౌందర్యము కల్పింపబడినది. తృతీయ చరణాంతమున రుంద్రే యనిరి. ఇందుఁ గ్రార యధికము. సంయుతాసంయుతప్రాసకల్పనము తెలుఁగుకవుల చేతిలో మెదిగిన శిల్పము. కాఁగా సమస్తసౌఖ్య ప్రదరీత్యమందే యనుట మఱొక విశేషము. "విశిష్టపదరచనా

రీతిః" అని వామనాచార్యుఁడన్నాడు. 'అట్టి రీతి సాయిబాబా ప్రసాదించఁగలఁడని వీరి విశ్వాసము. ఉపజాతి వృత్తముద్రచే సాయిబాబాముని చాతుర్వర్ణ్యమునకు జెందినవాఁడు 'కాఁడని, రీతి శబ్దముచే వా గధిష్ఠానమూర్తి యని స్ఫురింపఁజేసిరి.

గుప్తగారు ఆశుకవి. ఆశుకవుల దృష్టి జాతి మీఁదనుండును. రీతి మీఁదనుండదు.. ఉన్నచో నంత యురవడిగా ( గొండమీఁది ఱాయి క్రిందికి దొరలినట్లు పద్యము పరుగెత్తదు. గుప్తగారి ప్రతిజ్ఞవినుఁడు.

ఉ॥ "గంటకు నూఱుపద్యము లఖండతరంబగు ధారతో సభా
మంటపమందు నిల్చి బుధ మానితరీతిని బల్కువాఁడ, మీ
వంటి సుధీంద్రు లెల్లరును వహ్వారె యంచును మెచ్చుచుండ, వా
ల్గంటుల మోవి తేనె వలెఁ గ్రమ్మరసంబుల నీనుచుండఁగన్".

ఈ పద్యమునందును రీతి ప్రస్తావింపబడినది. చతుర్విధకవితానిర్వాహకుఁడైన యల్లసానిపెద్దన యాశువుగాఁజెప్పిన యుత్పలమాలికలో, "డాతొడసున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ వాతెఱ దొండపండువలె వాచవి గా వలె" నన్నాఁడు. గుప్తగారును బెద్దన త్రోవఁ ద్రొక్కి, వాల్గంటుల మోవితేనె యనిరి.

గుప్తగారి పద్యములు చూచినచోఁ గుంటుపడని నడకయే రీతి యని, చమత్కృతియే రసమని వారి యభిప్రాయమని యవగతమగును. ఆశురచనకు నలవాటుపడినవారు సభాంగణమున నిలుచుండి పలికినను, గృహాంగణమునఁ గూరుచుండి యొలికినను బ్రాయికముగా రీతిభేదము కనఁబడదు.

అవధానపద్యములు ముక్తకములు పద్యాంతరసంబంధములేని స్వతంత్రపద్యము ముక్తకమనఁబడును. పృచ్ఛకుడు వేశ్యలను జూచి ఋశ్యశృంగర్షి యేమనెనో చెప్పఁగోరు ననుకొందము. అవధాని.

కం॥ "మునులని తలఁచెద మిము, మీ ఘనమగు నాశ్రమ
మదెందుఁగల దీ యెడకున్ బనివడి వచ్చితిరో, ప
ద్మ నిభములగు మీ మొగములు తగు నగ వెసఁగన్".

అని కందము చెప్పినఁజాలదు. సందర్భము వివరించి చెప్పవలెను. ఎవరు? ఎవరితో మాటాడిరి? చెప్పవలెను. అపుడది ముక్తకపద్యముగును. పూర్వావధానులందఱు ముక్తకపద్ధతిఁబాటించిరి. గుప్తగారును బాటించిరి.

17 – 11 - 1947 తారీఖున శ్రీగుప్తగారు, కావ్యకళాతీర్థ శ్రీజనమంచి శేషాద్రి శర్మగారి యాధ్యక్ష్యముతోఁ బ్రొద్దుటూరులో రంగయ్యగారి సత్రములో నొక యష్టావధానము చేసిరి. సుప్రసిద్ధపండితులు పృచ్ఛకులు. ఒక పృచ్ఛకమహాశయుడు 'యోగ్యురాలికి నపుంసకభర్త లభించినచో' అని ప్రశ్నించిరి. నాయిక యోగ్యురాలని పృచ్ఛకుఁడే చెప్పుచున్నాఁడు కనుక నసభ్యముగాఁ జెప్పుటకు వీలు లేదు. కనులు మూసికొని కాలము వెళ్లఁబుచ్చినదని చెప్పవలెను. గుప్తగారిట్లు చెప్పిరి.. అది –

విషయము తేటతెల్లము కదా!

తే. గీ. శీలవతియంచు నామెను జెప్పినారు,
శీలవతికి భావము కడు నోలి నెసఁగు,
నైహిక ప్రకారంబుల నరయకామె
పారమార్థికత్వంబునఁ బరఁగుఁగాదె?

యోగ్యురాలు శీలవతి. భావము హృదయము, కడున్, ఓలి, ఎసఁగు. మిక్కిలి ధర్మక్రమమున వర్తిలును. మనకు ఇహము పరము అని రెండున్నవి. ఇహసుఖము కలిసి రానపుడు పరలోక సుఖమయిన సాధించుకొనవలెనని యత్నించుట సజ్జనస్వభావము. దైవ మాయని దానిని దొంగతనముతో సంపాదించుకొనవలెనని శీలవతి కక్కుర్తి పడదు. 'పారమార్థికత్వంబునఁబరఁగుఁగాదె' అని పృచ్ఛకుని మీఁదికే త్రోసి యవునని పించుచున్నారు. ఇక్కడ అర్ధానుస్వారము దీసివేసి, 'గాదె' యని సమాధానపడుటకును నవకాశము కలదు. ధాన్యము నిలువ చేసికొనెడి వేదురు బద్దలతో నల్లిన పెద్దకొప్పెరను గాదె యందురు. ఆమె భర్తసేవచే దైవభక్తిచేఁ బ్రోగుపడిన పుణ్యఫలము నిండిన గాదె. గాదెలోని ధాన్యము భవిష్యత్కాలమున భోగ్యమగునట్లు, ఈమె పుణ్యఫలము భవిష్యజ్జన్మమున భోగ్యమగును. సహృదయులీయర్థముఁ గూడ గ్రహించి సంతోషింతురు.

ఒక దత్తపది చిత్తగింపుఁడు. బలిమి, కలిమి, చెలిమి, అలమి యీ నాలుగుపదములు కూర్చి, రాధావిరహము వర్ణింపవలెను. గుప్తగారిట్లు చెప్పిరి.

కం. బలిమిన్ జెందిన ప్రేమపుఁ, గలిమిన్‌గల నందుపట్టి గారాబంపుం
జెలిమిన్ దలఁచియుఁ దలఁచియు, నలిమికొనిన విరహబాధ నారాధ గనెన్.

దత్తపదములూ పొసఁగించికొనుటకుఁ బ్రయాసపడలేదు. తలఁచియు తలఁచియు సముచ్చయ సహితముగా నామ్రేడించి రాధావిరహబాధయొక్క యుత్కటత్వము వ్యంజిత మొనర్చిరి.

అష్టావధానమున నిషేధాక్షరి యవధాని ప్రతిభాపాండిత్యములకు గీటురాయి. ఛందము, అర్థాన్వయబంధము చూచుకొనుచు, నిషేద్ధకు, గోచరము గాని మార్గమునఁదప్పించుకొని తిరుగుచుఁ బద్యము పూర్తి చేయవలెను. శబ్దశాస్త్రనిష్ణాతుఁడై చేతినిండ శబ్దసంపత్తి కలవాఁడు అవలీలగా నిషేధాక్షరి పద్యము నిర్మించఁగలఁడు. విశేషించి దుష్కరప్రాసాదులు నిర్వహించుచు, శబ్దాలంకార చమత్కారము సయితము సాధించఁగలఁడు. ఈ పని చేయుటకుఁ బుష్కలమైన భాషావైదుష్యము కావలెను. తెలుఁగు పదము వేయుచున్నాఁడనిపించి, సంస్కృతపదము, సంస్కృతపదము వేయు చున్నాఁడనిపించి, తెలుఁగు పదము వేయఁగల యొడుపు కావలెను.

గుప్తగారి యొడుపు వేఱు. అచ్చతెలుఁగుపలుకులతోనే ముచ్చటగాఁబద్యము ముగింతురు. నిషేదాక్షరి. పూలదండ వర్ణ్యము.

కం. రంగుల్ చాద్పుల్ మేటీ, యంగన్ హాళిన్ బ్రకార మానందంబై
మంగళకరమగు మాలిక, నుం గళసీమం ధరింపనుం దగె నేఁడున్.

ఇందుఁ బూర్వార్థము మాత్రమే నిషేధమునకు గుఱియై నడిచినది. ఉత్తరార్థము నిర్నిషేధముగ నడిచినది. పూర్వార్థమునఁబూలదండ నిఱికించు ప్రయత్నము జరిగినది. కాని, పృచ్ఛకుఁడు 'హా' యనినంతనే రేపము నిషేధించెను. అవధాని 'ళి' వేసికొనిరి. హాళి, ఆనందము సమానార్థక శబ్దములే యయినను జాతి వేఱు. ఒకటి తెలుఁగు, మఱొకటి సంస్కృతము. అలవోక, చతుర్థ చరణాది సముచ్చయము గూర్చి, యతిస్థానమందును దత్సదృశ్యమగు సముచ్చయము గూర్చి, క్రొంజిగి సంతరించిరి.

గుప్తగారు గ్యాస్‌లైటు గురించి చెప్పిన నిషేధాక్షరి పద్యపూర్వభాగము వా పరిశోధన గ్రంథము 'అవధానవిద్య' యందుఁ బ్రకటించితిని.

ప్రొద్దుటూరు శ్రీకన్యకాపరమేశ్వరీశాలలో శ్రీగుప్తగారు అష్టావధానము చేసినపుడు నిషేధాక్షరి పృచ్ఛకులు మద్గురుపాదులు శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారు గ్యాస్‌లైటు వర్ణింపఁగోరిరి. దేవతాస్తుతి కాదు. పురాణకథ కాదు. ప్రాచీనకవుల చేతిలో మెదిగిన వస్తువు కాదు. అధునిక వస్తువు . వెలుఁగు. శాస్త్రిగారి నిషేధమునకు గుఱియై గుప్తగారి భారతి నడిచిన తీరు - "కం. కడు సమ్మతి నిచ్చున్‌గా, నెడ నెచ్చో నొగి కడున్ రహిన్ బలు వెసఁ దా" ఇది యింతే. ప్రొద్దువోవుట యేల యని యుత్తరార్థము వదిలివేసిరి. జరిగిన రెండు చరణములలో రెండు చోటులఁ గాంతిపర్యాయపదము వేయుటకు నవధాని యత్నించిన చిన్నె లగుపడుచున్నవి. ప్రథమచరణమున నాఱవయక్కరము 'ని' నిగ్గన కుద్దిష్టము. ద్వితీయచరణమునఁ బదుమూడవ యక్కరము 'వె' వెల్గన కుద్దిష్టము. వక్త్రుద్దేశము గ్రహించిన పృచ్ఛఁకుడు గకార లకారములు నిషేధించుటతో నిగ్గుపోయి 'నిచ్చుంగా', వెల్గుపోయి 'వెస' అయినది. వెల్గు రానేలేదు. సంస్కృతమున వెల్గున కెన్నియో పర్యాయపదములున్నవి. "స్యుః ప్రభా కు గ్రుచి స్త్విడ్భా శ్ఛవి ద్యుతి దీప్తయః రోచి శ్శోచి రుచే క్లీబే" అని యందఱకును నోటికి వచ్చిన అమర మున్నది. రుక్, త్విట్, భా, భాః - ఇవి యేకాక్షరములుః ఇఁక ఁ దెలుఁగున - నిగ్గు, డాలు, మినుకు, మిన, మించు, నిగ, తళ్కు, మెఱుఁగు, చికిలి, కళుకు, జిగి, రంగు, మెఱపనఁబొలుచుఁగాంతి యని సాంబ నిఘంటువు సెప్పినది. వీనిలో డాలును డాల్ అని యేకాక్షరముగాఁబ్రయోగింపవచ్చును. చా, ఛ, ద్యు వర్ణములు కాంతి పర్యాయములే. ఆయు ప్రభయే. ఇవి యేవియు గ్యాస్‌లైటు పద్యమునఁజోటు చేసికొవలేదు.

పద్యార్థము చూతము. ఎడన్ = ఈస్థానమున, ఎచ్చో = ఏచోట అనఁగా అంతట, ఒగిన్ = వరుసగా, కడున్ = అత్యంతము, తాన్ = గ్యాస్‌లైటులు తాను, బలు = మిక్కిలి, వెసన్ = శీఘ్రముగా, రహిన్ = ఆనందమును, కడున్ = అత్యంతము, సమ్మతిన్ = ఇచ్చుతో, ఇచ్చున్ = కా = ఇచ్చును గదా. సహృదయులు దీనిలో వెలుఁగును రహిశబ్దమునందే చూడవలెను. శబ్దరత్నాకరము రహికి ఆనందము, ఆసక్తి, తెలివి, బాగు, రక్తి, విధము అని అర్థము లిచ్చినది. ఇక్కడి రహికిఁ బ్రకాశమనియే ప్రాకరణికార్థము. పద్యమున 'కడు' పదము పునరుక్తము. అయినను రెంటికి నడుమ 'ఎడ' యున్నది.

ఎడ, ఎచ్చో, ఒగి, రహి, బలు, వెన, తా, కా, ఇన్ని తునుకలు జోడించి పద్యము నిర్మించుట యలంతిపని కాదు. ప్రథమపాదాంతమున 'కా', ద్వితీయ పాదాంతమున 'తా' పూరణార్థము వచ్చిన గురువులే. పూరణమను మాటకు వచ్చినచో మొత్తము ఇరువదిమూఁడు వ్రాలు పూరణమే. అయినను ఈకూర్పునందు నేర్పు లేదన లేము.

ఇందాఁక అవధాన రచన గుఱించి వివరించితిని. ఇఁకఁగావ్యరచన చూతము.

గుప్తగారి కృతులలో శ్రీకన్యకాపురాణము గణనీయము. కన్యకాపురాణ తృతీయాశ్వానము నందలి యేకాశీతితమపద్యము చంపకమాలికావృత్తము. 'ఈ పద్యము దాని పేరుకుఁ దగినట్లున్నది. దాని కదియే సాటి. జానుతెనుఁగు పలుకులలో లలితలలితముగా నందముట్టిపడునట్లు రచింపఁబడినది.

చం॥ నగు నగునేని చాలుఁబ దునాఱు కళల్ గల యా సుధాకరున్
నగు, మొ గమంద మన్ననలనాకవనీ కనకార విందమున్
నగుఁ, గ రవల్లి కల్కమలనాళ ములన్న గు, ముష్టిముష్టితో
నగుఁ, గ వునిట్టు లాపడుచు నల్వగునంద మెసంగెఁ గ్రందునన్. "

ముఖసౌందర్యము నందన వన కనకకమలములను బరిహసించునఁట. ముఖము పద్మముతో నుపమించుట కవిసమయము. వీరు వట్టి కమలమని చెప్పలేదు. కనకకమలమనిరి. అదియు దేవతావనమున జనించిన దనిరి. నాకవనిలో మందార పారిజాత సంతాన హరిచందన కల్పవృక్షాదులుండును. కనకారవిందములు నాకధుని యందుండును. వనీస్థానమున ధునీశబ్దముఁ గూర్చియుండిన బాగుండెడిదని కొంద ఱనుకొనవచ్చును. అది నిజమే. కాని, నాకవనీ సరసీ కనకారవిందమని, సరసి నధ్యాహరించి కొని పఠించినచో నంద మినుమడించును. ఇది ప్రౌఢకవిమార్గము. దేవతాపద్మముతోఁ బోల్చుటచే, ఈకన్య సామాన్య కన్య కాదని, కనకకమలములనుటచే, ఆకన్నె వన్నె బంగారము వంటిదని చెప్పక చెప్పినట్లయినది. ఉత్తమకావ్యపద్యము లిట్లుండును.

ద్వితీయాశ్వాసమున శిఖరిణీవృత్తము, "ఖచార్యగ్రణ్యా" అని గంధర్వుని సంబోధించుచు నారంభించిరి. ఖ+చారి = ఆకాశమున జరించువాఁడు. గంధర్వుఁడు. అగ్రణ్య శబ్దము శ్రేష్ఠవాచకముగాఁ బ్రయోగించిరి. అగ్రణ్యుఁడనఁగూడదు. అగ్రగణ్యుఁడనవలెను. ఈ ప్రమాదమునకు మూలము శ్రీతిరుపతి వేంకటేశ్వర కవుల దేవీభాగవత తృతీయస్కంధములోని 476 పద్యమునందలి "లోకైకాగ్రణ్యుఁడు" అనెడి ప్రయోగము. గురుభక్తితో ననాలోచితముగా "ఖచార్యగ్రణ్యా" యనిరి. ఖచారిశ్రేష్ఠా అని దిద్దికొనవచ్చు. ఇబ్బంది యుండదు. తరువాత గురువులు తమ ప్రమాదమును గుర్తించి, 'లోకైకస్తవ్య' అని దిద్దికొనిరి. చెళ్ళపిళ్ళవారు క్వాచిత్కముగాఁ బ్రయోగించు కొన్ని క్లిష్టరూపములు గుప్తవారు బహుళముగాఁ బ్రయోగించిరి.

పురాణకథారంభమున "సూతుఁడు రాఁగ .......... కాంచియున్." కాంచి అనిన జాలును. పాదపూరణార్థము 'యున్' అనెడి సముచ్చయముఁ గూర్చిరి. చూచియు

మునుపు మాటాడలేదా? అనిన మాటాడిరి. "అమర్థులు అది గనియున్ మెచ్చన్" 5 - 6. ఇదియు నట్టిదే. "వింధ్యవాసినికి జోత లిడియును, బద్మనయనుడగు జనార్దనుఁ గొల్చియు నొగిని" 6 - 168. ఇట్టివి సర్వత్ర కలవు.

'మంగళారతులు' అను వ్యావహారికరూపములు ధారాళముగా వాడుదురు. అఖండయతులు, లకారమునకు రేపముయతి చెల్లించుట, నిశ్శంకముగాఁ బొసఁగింతురు. ప్రాసవిషయమున నెంత స్వతంత్రింతురో 'ఓంకారధ్వని' కందమునందలి చతుర్థచరణముఁ జూచినఁదెలియును. 5 - 35. శ్రీచెళ్ళపిళ్ళవారి భాషలో నవి నీహారలేశములు.

ఈ పురాణమునకు మకుటాయమానముగా, నేఁ గంబారి మీఁద వాస వాంబికయేగుచుండఁగా నగ్నికుండముల కడకు వైశ్యభ్రమర్షకైశ్యలందఱు పిఱుందఁ జనుట, యేకోనవింశతిచరణముల యుత్పలమాలికఁ బ్రబంధకవుల ప్రాగల్భ్యము పుణికి పుచ్చుకొని వర్ణించిరి.

అటనటఁగ్రొత్తవృత్తములు రచించి చమత్కృతి చూపిరి.

ఆముక్తమాల్యదయందు ఆశ్వాసాంతమునఁగర్తృనామముఁచెప్పఁబడినట్లు, కన్యకా పురాణమున ఆశ్వాసాంతమునందుఁ గర్తృనామము చెప్పఁబడినది. ప్రత్యేకించి పద్యబంధమునందు జెప్పు సంప్రదాయము నైషధకావ్యమునుండి దిగుమతియైనదని చెప్పవచ్చును.

ప్రబంధమునకుఁ గావలసిన హంగులెఱింగిన గుప్తగారు పురాణమునకు నవత్వము చేకూర్చి రనుట యతిశయోక్తి కాదు.

గుప్తగారి వాక్కు - "దివ్యాపగానూన భంగీ నిర్నిద్రతరంగ మంగళమహాగీర్వైభవం బేర్పడన్" 2 - 158. నిరర్గళముగాఁ బొంగి పొరలుచున్నది..

వీరు నిర్వహించిన యవధానసభలు, గడించిన బిరుదములు, సంపాదించిన స్వర్ణకంకణ పదకాదులు అగణ్యములు. 'అ గజాంత మైశ్వర్య' మన్నారు. గజారోహణ సమ్మానము పొందిన గుప్తగారు ధన్యులు. ఇంతకంటె నైశ్వర్య మేమున్నది!

ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవసంచికలో శ్రీవేలూరి శివరామశాస్త్రిగారు ఇటీవలి యవధానులఁ బేర్కొనుచు, 'దోమాకవి, సుబ్బన్నకవి' అని మమ్మిరువుర నొకచో నిలిపిరి. ఈనాఁడు శ్రీదోమావెంకటస్వామిగుప్త సాహిత్య పీఠమువారు నాచేత గుప్తగారిని గుఱించి నాలుగు మాటలు పలికించి నన్ను సత్కరించుచున్నారు. ఈ పీఠమునకు నా

సాహితీపరిమళోల్లసిత హృదయకమలుఁడు, వైశ్యకుల రత్నాకర కౌస్తుభాయమానుఁడు శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారు పీఠమున కింకను వన్నె తేఁ గలరని నా విశ్వాసము.

మ॥ మసృణస్ఫూర్తి యశఃప్రకాశుఁడగు దోమా వేంకటస్వామి గు
ప్త సభారంజనశక్తియుక్తుఁడనుచున్ బద్యంబు సత్యంబ ప
ల్కు సమర్థుండనుచున్ వధానకళ దిగ్వర్గంబునం జాతి యు
ల్లసిలుం గీరికి చెట్టవట్టెననుచున్ శ్లాఘింతు నత్యంతమున్.

**(శ్రీ దోమావెంకటస్వామి గుప్త గారి వర్ధంతి - ఫిబ్రవరి 12 సందర్భంగా)**

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973

## విజ్ఞప్తి

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రములందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగాచేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు

**ఆర్.ఆర్.నాథం**
మేనేజింగ్ ట్రస్టీ

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా
పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠము ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రీకులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8 2 1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# సోమయాజుల వారి ఉపన్యాసాలు - 1

(గత సంచిక తరువాయి)

14. ఇటువంటి నిదర్శనము లనేకములు జూపింపవచ్చునుగాని ఇప్పుడు కాలము వ్యర్థపుచ్చనెంచలేదు. "సుర" అనునది అసుర అను పదమునుండి పుట్టినదిగాని అసుర, సురనుండి యుద్భవించినదిగాదు. వేదములో సుర అనునది ఎచ్చటనైనను దేవతలను అర్థముతో నుపయోగించినట్లు కానబడదు.

15. అదితియను మాటకు ప్రస్తుత పండితులెల్లరు కస్యపప్రజాపతి భార్యయని యర్థమిచ్చు చున్నారు. కాని వేదార్థమేమి? మనపూర్వు లొకనూతన పదార్థము కనుగొనినట్లు దీనివలన మనకు తెలియు చున్నది. ఆపదముయొక్క భావమెంత యుత్కృష్టమైనది? "అదితి" అనగా అనంతమని యర్థము. ఈ సందర్భమున మాక్సుముల్లరు వ్రాసిన దానిని చదువవలసియుండును. (లెక్చర్సు ఆన్ ది ఆరిజన్ అండ్ గ్రోతు ఆఫ్ రిలిజియన్) (Lectures on the origin and growth of Riligion) 233 పుటచూడుము.

16. అనంతమను పేరుగల (సంస్కృతమున అదితి) యొకదేవత వేదమందు కలదని స్ఫురించినపుడు నేనెంత యబ్బురమందితినో మీరట్లే ఆశ్చర్యమగ్నమానసులగుదురు.

17. అదితి దితియను పదమునుండి అయియున్నది. వ్యతిరేక ప్రత్యయమైన (Negative Participle) అ, దితి, అనునది దా (ద్యాతి=కట్టుట) అను ధాతువునుండి యుత్పత్తి యయినది. దీనినుండి దిత (కట్టబడిన) అనబడు నసమాపక క్రియయును దితి, అనగా కట్టబడిన లేక కట్టబడుచున్న యను నామవాచకమును ఉత్పత్తియయినది. కనుక అదితి అనుపదము ప్రారంభమున బంధింప బడనిది. అనగా, అనంతమైనది. అడ్డు లేనిది. అంతులేనిది. అని యర్థమిచ్చి యుండవలయును.

18. ఇప్పటి సంస్కృతమునుబట్టి శోధించినయెడల వేదము అవగాహనము కానిది. బహు దేవతారాధన బోధించు చున్నది. అసందర్భమైనది సరిగా నర్థము చేసికొనునెడ అదియొక దేవతారాధన సూచించుచున్నది, దంభరహితమైనది. జ్ఞానదాయకమైనది. ప్రస్తుత మిప్పుడు అనేకవర్ణములును, శాఖలుగను ఏర్పరచినట్టి యూచార మసత్యమని బోధించుచున్నది. అందు స్త్రీ పునర్వివాహమును ఆక్షేపించుట కెట్టిపునాదియు లేదు. బాల్యవివాహము లం దనుమతింప బడలేదు. సముద్రయానము నిషేధింపబడలేదు. సూక్ష్మముగా జెప్పిన యెడల యిప్పటి పాశ్చాత్యనాగరికు లేమిచెప్పుచున్నారో యదియె చెప్పుచున్నది.

19. ఏక దేవతారాధనను గురించి మానవుడు భగవద్భక్తిని గ్రహించి యీశ్వరునిగాంచెను. ఆయనకు పేరు బెట్టవలసియుండెను. పేరేమిబెట్టగలము. మీప్రాగ్ పాశ్చాత్య జ్ఞానములతో నిరాక్షేపణమగు నామమూహింపగలరా? నేను తగినపేరు చెప్పలేదని గట్టిగా నమ్ముచున్నాను. వానిని పనిబట్టిగాని గుణమునుబట్టిగాని సగుణునిగా గాని పేర్కొనవలయును. వానిచే సృజింప బడునగ్ని ప్రజ్వరిల్లుటచూచి వాని నగ్నియని జీరుము. ఋగ్వేదము "అగ్నిమీళే" అని ప్రారంభింప బడుచున్నది. నేను భగవంతుని స్తోత్రము చేయుచున్నాను. వానిలోమంచిని (Good) జూచు చున్నాము. మంచిగాంచి యతనికాపేరు బెట్టదలచి (Good) గుడ్ అనుదానిని సంక్షేపించి (God) అని పిలుచు చున్నాము. హైందవయూదీయ వేదములలోని భగవంతుని నామము లనేకములు పుట్టినరీతి యిదియే? ఇట్టి స్వప్రమాణ సిద్ధాంతమునకు (మనలో కొందరంగీకరింపక పోవచ్చును) సహాయముగా నేను రాబ్సన్‌గారి హిండూజమ్ అండ్ ఇట్సు రిలేషన్ టు క్రిష్టియానిటి (Hinduism and its relation to christianity) గ్రంథములోని కొన్ని వచనములను యిచ్చుట నిరూపించు చున్నాడను.

20. ఆర్యులు భగవంతుని యొక్క యాశీస్సులను వానియొక్క మహా కార్యమును బట్టి పేరిడుటచే యనుభవములోనికి దెచ్చుకొన ప్రయత్నించి నట్లు కనబడుచున్నది. వేదమంత్రములు వివిధ దేవతలకు సంబోధింపబడినవి. ఆ దేవతల పేర్లు సృష్టిపరిణామములకు గూడ యర్థమిచ్చు చున్నవి. లేక వాటినుండి అట్టియర్థము సాధింపవచ్చును. ఇటులుండగా భక్తుడు ప్రప్రథమమున సృష్టిలో నుండి సృష్టికర్త యగు దేవుని జూచినట్లును వానిని వాని కృత్యముల పేర్కొనుటచే వానినారాధింప యత్నించి నట్లును భాషనుబట్టి దృష్టాంతములు గనబడు చున్నవి.

21. పూర్వపు హెబ్రూమత బోధకులు బహిరంగ యీశ్వరా రాధనలో జిహోవాయను నామము విసర్జించి దానికి బదులుగా సంభాషింప నలవిగాని వాడనిగాని తదర్థ మోసగు మరియొక పదమును గాని ఉపయోగించుట వారి యొక్క ఘన గుణాతిశయమును బట్టియేయైనది. ఏలనన మానవభాషలో ఆ యతీతునికి తగినపేరుబెట్ట సాధ్యపడదు. ఇంతవరకు మనము చేయగలిగినదేమన్న యొక గుణమేదో యెత్తుకొని యాదేవతకు యితరగుణముల నారోపించుటకు మన మీశ్వరునియెడ ప్రయోగించు నామము లన్నియు నిట్టివేయని కనబడుచున్నవి. దృష్టాంతము. గాడ్ (God) యెహూవా యనగా నిత్యుడు, అనంతుడు, ప్రభువు, సర్వ శక్తివంతుడు, అతీతుడు, యీ

నామములన్నియు మనబుద్ధి వికాసము వలన భగవంతునికి యుపయోగింప తగినవని మనవివేచనాశక్తి మనకు బోధించుచున్నది. ఏ యొకనామమైన వాని స్వభావముయొక్క కొంతభాగమునే వర్ణించు చున్నదిగాని మనము సర్వమును దెలుపు చున్నదని యనుకొనుచున్నాము. మనము సగుణుని కొరకు ప్రయోగించుట మూలముగా నెరవేర్చు కొన్న కార్యమును మనపూర్వికులు సృష్టికర్తకు సృష్టిలోని కొంతగాని అంతయునుగాని ప్రయోగించుటచే అనగా క్రియచే కర్తను తెలుపుటవల్ల నెరవేర్చుకొనిరి.

22. అగ్నికి రెండర్థము లున్నవని మీరు గమనించ వలయును. 1. సృష్టించబడిన యగ్ని, 2. సృష్టించేయగ్ని. ఇది పంధొమ్మిదవ శతాబ్దములో నొక్కరాబ్సన్ గారి యభిప్రాయమేనా? కాదు. వేల సంవత్సరములకు పూర్వము జీవించియుండిన మిగుల గొప్పవానియొక్క ప్రమాణమునే నిరూపించ గలను. బాగుగ జ్ఞాపకముంచుకొనుడు. వానిపేర "దీర్ఘతమసు" ఋగ్వేదమునాటి యొకఋషి. ఆయన "ఏకం సత్ విప్రాః బహుధావదంతి'

23. ఒక్కడేగలడు. జ్ఞానులు వానిననేకనామములతో పిలుచుచున్నారు. క్రైస్తవుల ప్రార్థన. "స్వర్గములోనుండు నా తండ్రీ నీనామము పవిత్రమగుగాక" అని ప్రారంభింపబడుచున్నది. మనపూర్వులు వానినెట్లు సంబోధించిరి. ఈ పైన చెప్పబడినవి మీ పుస్తకములలో నెం 223 పేజీలో మాక్సుముల్లరు చెప్పియున్నాడు.

24. మాక్సుముల్లరు పైపుస్తకము 223 పేజీలో సాధు హృదయులగు మన పూర్వులు ఆజగత్పిత నేమనిరి. అయిదువేల సంవత్సరముల క్రితము లేక నింకను పూర్వము మనయార్యులు సంస్కృతము, గ్రీకు, ల్యాటిను, భాషల నెరుగకమునుపే "జూఃపితర్" అనగా ఆకాశము తండ్రీ అని జెప్పుకొనుచుండిరి.

25. నాలుగువేల సంవత్సరములకు పూర్వము లేక నంతకుపైగా దక్షణమున పంజాబు నదులవద్దకు చేరినప్పుడు వానిని "జయుష్పిత", అనగా ఆకాశము తండ్రీ యనుచుండిరి.

26. మూడు వేలసంవత్సరములు లేక అంతకుపూర్వము హెలస్పాంటు తీరవాసులగు ఆర్యులు "హెవెన్‌ఫాదర్" అనిరి.

27. రెండువేల సంవత్సరములు లేక అంతకుపూర్వము యిటలీదేశార్యులు ప్రకాశమగు ఆకాశము వంకజూచి దానిని "జ్యుపిటల్" "హెవెన్ ఫాదర్", ఆకాశము తండ్రియనిరి.

28. వేయివత్సరముల్లకు పూర్వము యీఆకాశము తండ్రియే "హెవెన్ ఫాదరు" జగత్పితరుడు జర్మనీదేశపు చీకటి యడవులలో మన విచిత్రపు పూర్వులగు ట్యూటానిక్ ఆర్యులీ

నామమునే జిన్, లేక జియో అని కడపటిసారి వాడినట్లు తోచుచున్నది.

29. ఏనామ మేయోచనయును యెప్పుడు పూర్తిగా నాశనము కానేరదు. మిగుల్ల పురాతనమైన రోము దేవాలయము పిమ్మట స్థాపింపబడిన మనపురాతనాశ్రమమునందు దృగ్గోచరము కానివానికి అనంతమైనట్టివానికి మన నలుదిశలును వ్యాపించియున్నవానికి మనము తెలసికొనజాలనివానికి ప్రపంచమందును మనయందును లీనమైయున్నవానికి నొక నామము బెట్టవలయునని మనము ప్రయత్నించిన నొక చీకటిగదిలో ప్రార్థనకై మోకరించి స్వర్గమందున్న యోతంఢ్రీ యనిపిలిచిన పేరుకన్న వేరొండు సమాఖ్యతో మనము కనుగొనజాలము.

30. కాన నోసోదరసోదరీమణులారా! రెండువేల వత్సరములకు పూర్వము క్రీస్తుచే యుపదేశింపబడిన భావములన్నియు నాలుగు వేలవత్సరములకుపూర్వము మనే మహర్షులచే నుపదేశింపబడియుండెను. అకటా! ప్రస్తుతము మనహిందూదేశమున "ద్యౌపితా" అను పేరుయొక్క యర్థము మరచిపోయిరిగదా? ఏ విద్వాంసునైనను దానియర్థమడిగి చూడుడు. నేను రెండుదినములక్రింద మనసంస్కృతపండితునడిగి యుంటిని. "ద్యౌః" మనతంఢ్రియని పలికియుండిరి. తంఢ్రియను పదమువలన తల్లియను పదము మనసుకు స్ఫురించుచున్నది. కాన భూమిని మనతల్లియనిరి. వీరిద్దరకు వివాహము గావించిరి.

31. ఆర్యసోదరులు మానవజాతికి "ద్యౌపితా" అనగా యేసుక్రీస్తు జెప్పినట్లు స్వర్గమందున్న మన తంఢ్రియనియు స్వర్గము మనతంఢ్రి కాదనియు బోధింపవలసియున్నది.

32. యూదులును హిందువులవలెనే యీపదమును యర్థమును సరిగా గ్రహింపక పోవుటవలన క్రీస్తు తద్విధముగా నుపదేశింపవలసి వచ్చెను. స్వర్గమందుండెడి మనతంఢ్రిని పురుషుడని పిలుతుమా? స్త్రీయనిబిలుతుమా? అతడు పురుషుడునుగాడు. స్త్రీయును గాదు. ఆతనికున్న మహాశక్తివలన మనము పురుషుడనిపిలుచుచున్నాము. మన ఋషులు నట్లేబిలిచిరి. మనయజ్ఞానమాతని నెట్టిస్థితిలోనికి దెచ్చినదో చూచితిరా? అజ్ఞాను లసహ్యామైన లింగరూపమున నాతని ప్రార్థించుచున్నారు. ఆతని తల్లియని బిలువుడు. పురుషుడనుటకు బదులు స్త్రీయ తలంచుడు. అతడు ప్రేమాస్వరూపుడును, దయామయుండును నగుటచే స్త్రీయని తలంచుడు. అట్లయినచో, శక్తి, కాళి, యనబడు భయంకరనామము లొసగబడి వేనవేలుజంతువులు బలియివ్వబడుచున్నవి.

33. నేనిదివరకు నుడివినట్లే ఆతడు స్త్రీగాని, పురుషుడు గాని కానేరడు.

నపుంసకుడని తలంచెదము. అట్లయినచో నేమియగునో మనకెల్లరకు దెలిసిన విషయమే. నపుంసక మనగానేమి? గుణరహిత మైనదియు మంచి చెడ్డలులేనిధియు, ప్రేమ, దయ, మొదలగునవి లేనిదియునైయున్నది. బ్రహ్మమనగా నిర్గుణమని గ్రహింపు చున్నాము. వానికి గుణములేదని జెప్పెదరు. అట్టి ప్రార్థనవలన లాభము లేదు. ఆతడు మనప్రార్థనల వినజాలడు. మనల రక్షింపజాలడు. అందువలన నాతని నధముని జేసితిమి. అతని దైవత్వము పోయినది. దయాస్వరూపుడైన మనతండ్రి కానేరడు. మనరక్షకుడుగాడు. మానవునికి శరణ్యము గాని రక్షణముగాని లేనేలేదు. నపుంసకుడని తీసికొనుటవల్ల దేవుడు లేడనియే తేలుచున్నది. బౌద్ధమతము నింతకన్న వేరుచెప్పలేదు. మనకర్మలే మనల రక్షించునవియని తలంచు చున్నాము. నిస్సందేహముగా మనము సత్కార్యములు చేయవలసినదేగాని అవి మానవునెన్నడు రక్షింపజాలవు. మానవుడు పాప భూయిష్టుడు. తాను నిర్మలుడని చెప్పగల్గినవా రెవరైనను గలరా? హిమాలయములం దున్నారని చెప్పబడు మహాత్ములైనను పరిపూర్ణులైన నిర్మలులు గారు. మనుజుడు స్వకర్మలచేత నెన్నడును రక్షింపబడడు. ఈ ప్రమాణమును దేవుడొక్కడే మనకు రక్షకుడనియును బైబిలును వేదమును బోధించు చున్నవి. పవిత్రమైన భగవద్గీతయు పరమపవిత్రమైన గీతయు నీప్రమాణమునే బలపరచు చున్నది. శ్రీకృష్ణ భగవానులు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అహంత్వా సర్వపాపేభ్య మోక్ష యిష్యామి మాశుచ" అని చెప్పియున్నారు. అనగా నీవు కర్మచేత రక్షింపబడుదువను భావమును వదలి వేయుము. నేనొక్కడనే శరణ్యుడనని తెలసికొనుము. నీ పాపమునుండి నేను రక్షించెదను. విచారింపకుమని యర్థము. మనము మానవులకు వేదఋషులైన, క్రీస్తు, మహమ్మదు, కృష్ణుడు, నందరి బోధలొక్కటియేయని తెలియపరచవలసి యున్నది: మీలో కొందరు భిన్నాభి ప్రాయులు గావచ్చును. అద్వైత మత స్థాపకులైన మహాగురు. శంకరాచార్యులు "భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే, సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహి రక్షతి డుకృఞ్ కరణే" అని చెప్పియున్నాడు. అనగా వ్యాకరణము మొదలైన నీవిద్యలు మరణకాలమందు నిన్ను రక్షింపలేవు. కాన నో మూర్ఖుడా! దేవు నారాధింపుము, దేవు నారాధింపుము. అని యర్థము.

(ఇంకావుంది

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.2.1997 నుండి 20.3.1997 వరకు)

చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకం పన్ను మొత్తానికి చెక్కును వ్రాసి మార్చి నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారులకు అందునట్లుగా ప్రతి నెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి. చెక్కు ద్వారా కాకుండా చలానా ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును ఫిబ్రవరి నెల 20వ తేదీన గానీ, అంతకు ముందుగా గానీ చేరునట్లుగా పంపాలి.

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 జనవరి నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఫిబ్రవరి నెల 28వ తేదీలోగా చేర్చాలి.

1997 జనవరి నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ ఫిబ్రవరి నెల 28వ తేదీ లోగా చేర్చాలి.

## గంగవరం ఆంజనేయులుకు మాతృ వియోగం

అనంతపురం జిల్లా గుత్తి పట్టణ వైశ్య ప్రముఖులు శ్రీ గంగవరం ఆంజనేయులు, శ్రీ బదరీ నారాయణ గారల తల్లి శ్రీమతి సుబ్బమ్మ గారు 4.1.1997వ తేదీన స్వర్గస్తురాలయ్యారు.

## ఆకుల వెంకటేశ్వర్లు స్వర్గారోహణ

వరంగలు పట్టణ ప్రముఖులు, ప్రముఖ వర్తకులూ శ్రీ ఆకుల వెంకటేశ్వర్లు గారు 17.1.1997న స్వర్గస్తులయ్యారు.

## మట్టా రామనాథయ్యకు మాతృవియోగం

అనంతపురం జిల్లా కదిరి పట్టణ ప్రముఖులు శ్రీ మట్టా రామనాథయ్య శ్రేష్ఠి గారి మాతృమూర్తి శ్రీమతి కమలాక్షమ్మ గారు 30.1.1997వ తేదీన స్వర్గస్తులయ్యారు.

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.